Regd No. $\frac{H. 45}{M. 3813}$

1•25¶¶

వెల ఒక అణా

★
గోలకొండ డైరీ

వెల

౧రూపాయి
★

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక




సంపుటము ౧౬  హైద్రాబాదు-దక్కన్  శా. శ. ౧౮౬౩  వృషసం॥ర శ్రావణ బ॥౧౧(౧౨-౧౧-౧౩౫౦ ఫ.) సోమవారము  సంచిక ౩౧

## స్మోలెన్స్కు-పతనమును రష్యనులు ఒప్పుకొనుట

### దక్షిణంలో రెండుపట్టణాలు ఖాళీచేసిపోయిరి

రష్యా, జర్మనీలయుద్ధమునకు సంబంధించిన వార్తలలో ముఖ్యమైనసంగతియేమనగా, కొన్ని రోజుల(క్రిందట రష్యాసేనలు స్మోలెన్స్కును ఖాళీచేసి వెనుకకుపోయినట్లు ఆగస్టు ౧౩ వతేది నాటిప్రకటనలో రష్యనులుఒప్పుకొన్నారు. ఇదేవిధంగా ఆగస్టు ౧౪ వతేదిన తెల్లసముద్రం నుండి నల్లసముద్రంవరకు ఘోరయుద్ధము చేసిన తర్వాత, దక్షిణరంగంలో రష్యనులు కిరోవొగ్రాదు, పెర్వో మెయిస్కు-పట్టణాలను ఖాళీ చేసి వెనుకకుపారిపోయిరట

యూక్రెయినురంగములో ఒడెస్సాచుట్టు జర్మను సేనలు చుట్టుకొనినవనియు, హిట్లరు గారు స్వయముగా యూక్రెయినులో విడిదిచేసికొని యుద్ధమునడిపించుచున్నారనియు జర్మను ప్రకటనలు దెల్పుచున్నవి. ఈయూక్రెయినురంగంలో జర్మను సేన లందరినీయా సేనలు తరిమిపోరాడుచున్నవి-ఇవిఒడెస్సాయను, బగ్‌నదీముఖద్వారమునకును మధ్య నుండు నల్లసముద్రతీరమునకుచేరుకొన్నవట. ఈ ప్రాంతములో రష్యావారిసేనలు సముద్రమార్గమున క్రిమియాకును, కాకేసస్‌కును వెళ్లిపోవుచున్నవని స్వీడనునుండి వచ్చేవార్తలలో నున్నది-ఇపుడుజర్మను సేనలు స్మోలెన్స్కు-నుండి దక్షిణంగా కాకేసస్ వైపునకే పోవునట- అక్కడ పెట్రోలుగనులను వశపరచుకొనుట వారిప్రస్తుత ముఖ్యోద్దేశ్యము.

కాని ఒడెస్సాను జర్మనులు పట్టుకొనలేదనియు, దక్షిణరంగములో రష్యనుసేనను జర్మనులు ముట్టడివేసి యుండలేదనియు రష్యావారనుచున్నారు-

నీపరునదిదిగువభాగముమీదుగా జర్మనుసేనలు వెళ్లి ఇనుముగనులుండే క్రివోయిరాగ్ జిల్లాను వశపరచుకొన్నవనియు, అందువల్లరష్యావారికి సాధారణంగాఉండే ఇనుము ఉత్పత్తిలో ప్రతి ౧౦ ఉ-౧౧వంతు ఇపుడు జర్మనుల చేతిక్కి-వచ్చెనని జర్మనులుప్రకటించినారు-

జర్మనులు స్మోలెన్స్కు-ను పత్రికలవిలేఖకుల నుతీసికొనిపోయి అదివరకువశమైనదని నిదర్శనము గా చూపినారు- ఆపట్టణములోని యిండ్లన్నియు యుద్ధమైయున్నవి- మొదట జర్మనుసేనలు ఆ పట్టణములో ప్రవేశించుటకువచ్చినప్పుడు అమంట లవేడిని తాళలేక వెనుకకుపోయి కొంతఆగియుండి తర్వాతమరలవచ్చిచేరినవి- అనగ రానికి ఒక తెల్లరష్యాజాతీయు న్యాయవాదిని జర్మనులు మేయరుగానియోగించినారు-

ప్రతిరోజు మాస్కో-నగరంమీద జర్మనువిమానాలువెళ్ళి బాంబులు వేయుచునేయున్నవి- ఆగస్టు ౧౧౪, ౧౨వతేదులలో రష్యావారివిమానాలు బర్లినునగరంమీదికిపోయి బాంబులను వేసినవి-బాల్టిక్ సముద్రములో జర్మనునౌకలను రష్యనులు సముద్రములోముంచివేయుచున్నారు.

రుమేనియాలో రష్యావారి సొరంగముట్టులు రష్యాజర్మనీల యుద్ధారంభమునుండి దిగుమతియున్నారు-

ఇపుడుస్టాలినుదుర్గము అనునది అనేకచోట్ల చాలాచుట్టుకు ఛేదించబడినట్లు స్వీడిష్ పత్రికలలోనున్నది-

ఆగస్టు ౧౨ వతేదిన జర్మనువిమానాలు రష్యావారి లెనిన్‌గ్రాడుపట్టణముపైకి బాంబులు వేయుటకుపోయినవి గాని రష్యావారువాటినిరానీకుండ తరిమివేసిరట,

### రష్యావారి క్రొత్తఆయుధములు

ఫిన్లెండుతో యుద్ధముజరిగేటంగమందు రష్యావారొక క్రొత్తఆయుధమును ప్రయోగించుచున్నట్లు ఒకస్వీడిష్షుపత్రికలో(వ్రాయబడినది, పెట్రోలుతోనింపబడినగుండు ౨౦౦అడుగుల ఎత్తున ప్రేలిఅడవులునిప్పంటుకొని దగ్ధమైనవి? ఇవిప్రేలినవెంటనే ప్రయోగింపుచేరంగుల దెబ్బలుతక్రుస్తే నలచే అమంటలుఅర్పబడకుండచేయును. ఫిన్నిషు జాతివారలలోఆనేకులు భయంకరములైన గాయములచే బాధపడుచున్నారట-

### రష్యావారు(గ్రామాలను తగులబెట్టుట

స్వీడ్జర్లాండులోని ఒకపత్రికయొక్క- బర్లినునగరపువిలేఖరి జర్మనుయుద్ధపు ఫిలింప్రచారపు కంపెనీవారు చెప్పుచున్న సంగతులు రష్యావారు గ్రామాలను తగులబెట్టుచున్నారని స్పష్టముచేయుచున్న వనుచున్నాడు. లక్షలకొలది యిండ్లు నేలమట్టముచేయబడినవి యుద్ధరంగమునకు పోయివచ్చిన ఒకజర్మనువిలేఖరి ఇంతవరయుద్ధమునకు అంతముకనబడుట లేదనుచున్నారు

### జపానుప్రాంతపు వ్యవహారములు

జపానుయొక్క- వైఖరి, చర్యలుఇంకను బ్రిటిషువారికిని వారిపక్షమునచేరినవారికిని, అమెరికాకును ఆందోళనకలిగించుచునేయున్నవి క్రొత్తసంఘటనలేవియు గొప్పవిలేవు-

ఆగస్టు ౧౧౪వతేదిన జపానులో బ్రిటిషురాయబారియగు రాబర్టు క్రెయిగీగారు జపానుప్రభుత్వ విదేశాంగమంత్రియగు టొయోడాగారితో సంభాషించిరి. ఏమిసంభాషించిరో నిజముతెలియుటలేదు. కానిఅనుకొనేవారలు బ్రిటిషువిదేశాంగమంత్రి ఈడన్‌గారు ఇదివరలో జపానుచర్యలను గూర్చి తెలిపిన హెచ్చరికనే క్రెయిగీగారు జపానువిదేశాంగమంత్రికి మరికొంత వివరణచేసియుండవచ్చునని అనుకొనుచున్నారు. ఇదేవిధముగా అమెరికా సంయుక్తరాజ్యప్రభుత్వపు రాయబారి కూడ టొయోడాగారితో సంభాషించదలచి యున్నట్లువార్తవచ్చెను గాని, అసంభాషణజరిగినట్లుఇంకనువార్త రాలేదు-

ఆస్ట్రేలియా మంత్రివర్గము అత్యవసరముగా ఆగస్టు ౧౧౪తేది మధ్యాహ్నముతర్వాత సమావేశమై మొత్తము ౧౨ గంటలసేపు చర్చజరిపెను. మరు మరునాడు సమావేశమై మరల ౩ గంటలసమావేశము జరిపెను. ప్రభుత్వశాఖల ప్రధానాధికారులనుకూడ పిలిపించి వారలనుండి అవసరములైనవిషయములను తెలిసికొని చర్చించెను- పసిఫిక్ ప్రాంతమునకు జపానువల్లకలుగుభయమునుగూర్చియే ఆలోచించుచుండెను. ఈవిషయములో బ్రిటిషుప్రభుత్వముతోకలిసి ఆలోచించుట అవసరమనిపించియుండును కాబోలు మంత్రివర్గమువారు ఏకగ్రీవముగా మరలప్రధానమంత్రియగు మెంజీసు గారిని లండనుకుపోవుటకైకోరిరట ఆస్ట్రేలియాయుద్ధకౌన్సిలువారును, శాసనసభవారున్నుమాచనకు ఆమోదించినతర్వాత మెంజీసు గారు లండనుకుపోవచ్చును- కాని ఈలోగా యుద్ధకౌన్సిలులోనిఇద్దరు లేబరుపక్షపుసభ్యులు మెంజీస్ గారు ప్రస్తుతఆందోళనస్థితిలో దేశమువదలిపోవుట యుక్తముకాదనుకొని మెంజీసుగారువెళ్లిపోవుచో లేబరుపక్షపువారు ప్రభుత్వమును చేపట్టినడిపించుటకు సిద్ధముకావలెననియు తమపక్షమును ఆగస్టు౧౨వతేదినఒత్తిడిచేసినారు. ఆగస్టు౧౩, ౧౪వతేదులలో వారికొన్ని సమావేశములు జరుగుచుండెను- మెంజీసు గారి లండనుప్రయాణ

ముసంగతి శాసనసభవారికి వదలివేయుట యుక్తమనితలచబడెను- ఇపుడులండనులోశాశ్వతంగా ఆస్ట్రేలియాప్రతినిధినొకరినిఉంచుట అవసరమని తలచబడుచున్నది-

కనడావాణిజ్యనౌకాశాఖమంత్రి మెక్డొనాల్డు గారిపుడు లండనులోనున్నారు- పసిఫిక్ ప్రాంతములో ఉపద్రవముకలిగినచో కెనడావారియుద్ధనౌకలు వాటివాటితగినస్థానములలో నుంచబడునని ఆగస్టు౧౧౪వతేదిన చెప్పినాడు-

రూజ్వెల్టుగారును చర్చిలుగారును అట్లాంటిక్ సముద్రముమీద ఒకనౌకయందు సమావేశమై ముఖ్యములైనయుద్ధపరిస్థితులనుగురించి చర్చించినట్లు ఇపుడుప్రకటించబడినది- ఆసమయమున వారివెంటఉభయరాజ్యాలప్రభుత్వములకు జెందినసైనిక, వైమానిక, నావికశాఖలఅధిపతులుఉండిరి-వీరలుముఖ్యముగా జపానుచర్యలవల్ల కలుగుచున్న ఉపద్రవస్థితినిగూర్చి చర్చించియుండవచ్చును

జపాను యుద్ధనౌకలుమరికొన్ని ఆగస్టు౧౨వతేదిన సైగానులోవచ్చిచేరినవి ఇండోచైనాలోకి పంపబడిన జపానుసేనల ప్రధానాధిపతి ఆగస్టు ౧౪వతేదిన ఇండోచైనా సముద్రంలో జపానుయుద్ధనౌకల ప్రధానాధిపతితో సంభాషించిరి

థాయిలాండుసేనలు ఇండోచైనా సరిహద్దులో ముఖ్యకీలకస్థానములకు పోవుటకై ఆగస్టు ౧౨వతేదిన ఆజ్ఞాపించబడినది.

చైనావారును ఫ్రెంచి ఇండోచైనావైపుఉండే తమ సరిహద్దులందు సేనలు చేర్చుచున్నారు-

ఇండోచైనాలో ఇపుడు ౧౫౦౦౦౦ జపానీయసేనలున్నవి.

రష్యావారి సైబీరియాసేన సుశిక్షితముకాని గుంపుమాత్రమేయని గొప్పగొప్ప జర్మనులప్రతినిధులు జపానువారితో చెప్పుచు మోసపుచ్చుచున్నారట.

### ఫ్రాన్సు రాజ్యత్రయ సంధితోచేరునా?

ఇపుడువిషీలో ఫ్రాన్సుయొక్క- రాజకీయసంబంధములనుగూర్చియు, జర్మనీ, ఇటలీ, జపాను లకలిసికొనినియుండిన ఒడంబడికలో ఫ్రాన్సు చేరుటనుగూర్చియు మాత్రమేగాక కొంతసైనిక సహకారమును గూర్చియు, జర్మనీసహకారము



## మహమ్మదీయులు, హిందువులును ఆర్యులే

### డాక్టర్ ప్రాణనాథ్ గారి క్రొత్తసిద్ధాంతము

#### ఉస్మానియావిద్యాపీఠమందు ఉపన్యాసము

ఆగస్టు ౫ వతేదిన, ౬ వతేదిన కాశీవిద్యాపీఠమునకు సంబంధించినడాక్టర్ ప్రాణనాథ్ గారు హైదరాబాదు దక్కన్ నగరమున టౌన్‌హాలులో ఉస్మానియా విద్యాపీఠముయొక్క-యాజమాన్యమున రెండు ఉపన్యాసములనొసంగిరి రైట్ ఆనరబిల్ సర్ అక్బర్ హైదరిగారు ఉపన్యాసకునిసభవారికి పరిచయముచేయుచు వారిపాండిత్యప్రకర్షను ప్రశంసించిరి-

ప్రాణనాథ్ గారు ఉపన్యసించుచు ౧౧ ఏండ్లుకష్టపడినతర్వాత తాను ప్రాచీనఆర్యుల మొదటిభాషయొక్క-ను, ఇపుడు మధ్యప్రాచ్య

తో ఫ్రాన్సుయొక్క- కాలనీలను రక్షించుటనుగూర్చియు చర్చలుజరుగుచున్నట్లు ఒకస్వీడనుపత్రికయొక్క- బర్లినుయొక్క-విలేఖరి తెల్పుచున్నాడు, జర్మనీనుండివిషీప్రభుత్వమునకు ఒకఅంత్యసందేశము వచ్చియుండెననియు దానికిఆగస్టు౧౦ వతేదిలోగా జవాబీయవలెనియున్నదనియు,ఫ్రాన్సునుండి కొన్నికేవుర సౌకర్యములను రా పోకల సౌకర్యములును ఫ్రెంచిసామ్రాజ్యములో కావలెనని జర్మనీకోరినదనియు ఒకఅమెరికా బ్రాడుకాస్టు వ్యాఖ్యాతచెప్పినాడు.

### ముసోలిని కుమారుడు కూలిచచ్చుట

ఆగస్టు ౭వతేదిన ఇటలీలో పైసావద్ద ఒకవిమానము నేలకూలగా అందులో డిక్టేటరు ముసోలిని కుమారుడగు బ్రూనోముసోలిని మరణించెను, ఆవిమానము క్రొత్తగానిర్మితమైనట్టిది దానినిపరీక్షచేయుచుండిరి. ఇపుడు వారిభార్యయు, ౧౫ ఏండ్లకుమార్తెయు వారికుటుంబములో మిగిలియున్నారు- ఆవిమానంలో మరియిద్దరు అధికారులు చచ్చిరి, అయిదుగురు అధికారులకు గాయాలయ్యెను- డిక్టేటరు ముసోలినిగారు వెంటనే పైసాకు విమానములో తనపెద్దకుమారుడగు విటోరాతోపోయి, అక్కడినుండి కొంటాచెయిరా ఆస్పత్రికి మరణించినకుమారుని చూడబోయిరి, విమానము ఎందుకుకూలెనో తెలియుటలేదట- ఇటలీరాజుగారు ముసోలినికి విషాదసందేశమును తంతిద్వారాపంపిరి

ప్రాంతమనబడుచోట దేశాలలో ఇపుడుండే ఇతరులభాషలయొక్క-యు స్వరపద్ధతిని కనుగొనగలిగితిని. వర్ణమాలాన్యాయముల సహాయముతోవారు భారతదేశంలోను, సుమేరులోను, అసీరియాలోను, ఈజిప్టులోనుదొరికిన ప్రాచీనశాసనములను చదివివినిపించి, ఇవన్నియు ఆర్యులశాసనములేయనిచెప్పిరి. అదే వర్ణమాలాన్యాయముల సహాయముతోవారు క్రీస్తుశకమునకు పూర్వము ౧౩౭౫ ఏండ్లక్రిందటి ఒకపెద్దపత్రములోనివిషయములను చదివిరి, ఆదలిఖాను -లబ్నీ(?) యనిశాసన తీవ్రములో మొదటిఆర్యులును సంస్కృతమును మొదట ఒకభాషనుండి పుట్టినవేయని తెలుచున్నదనిరి-

ఆర్యులపూర్వస్థానము క్రీ-పూ-౧౦౦౦-౪౦౦౦ ఏండ్లక్రింద ఇప్పటిమధ్యప్రాచ్యఖండమేనని ఇందులోఉత్తరహిందూస్థానము, మెసపొటేమియా, పర్షియా, అసీరియా,టర్కీ-, సిరియా, ఈజిప్టులు చేరియుండెనట, ఈదేశములప్రజలు ప్రపంచానికి విజ్ఞానమును ప్రసాదించగలవారనిచెప్పుకొనుట కర్హులనిరి, ఇదియేనిజమైనచో హిందువులును ముసల్మానులును పూర్వముహిందువులచే జంబూద్వీపమనియు, ఇపుడుఇంగ్లీషులో మధ్యప్రాచ్యమనియు అనబడుదేశంలోఉండిన ఒక్క-జాతినుండి చీలినవారలేయని సిద్ధమగుచున్నదని ప్రాణనాథు గారుచెప్పిరి. కాబట్టి హిందువుల మతప్రవక్తలును అయియున్నారు. ఈపరిశోధనలు స్థిరపడినవెంటనే వాటివల్ల ఐకమత్యముకుదురుటకు ఒకఆధారమేర్పడగలదు, అపుడు యూరపీయుపండితులుసృష్టించినసెమిటిక్ ఆర్యజాతులను రెండుజాతులున్నవను మాటపోయి మానవులకు ఉపకారముకాగలదు క్రీస్తుశకానికి ౩౦౧౦-౪౦౦౦ ఏండ్లక్రిందటి ఆర్యులను దురదృష్టవశమున సెమిటిక్‌జాతివారనిరి- ఆదేశాలనుండివచ్చిన క్రీస్తుశకానికి ౧౬౦౦ ఏండ్లపూర్వపువారు ఆర్యులనబడిరి, సెమిటిక్ జాతిఅనేది లేనేలేదని డాక్టర్ ప్రాణనాథ్ గారనుకొందిరి.

సంవత్సరము చందా
౬ పాలీ రూపాయిలు
ఆరుమాసాలకు
3 రూపాయిలు
బ్రిటిషిండియాకు
సం॥చందా
౫-౮-౦ కల్దారు.
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండపత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

The only Popular Paper That ... In the ...

Best Medium for Advertisement

Volume 16 | Hyderabad-Dn | Monday 18th August 1941 | Number 31


## కాంగ్రెసు విధానము మారదు

గాంధిమహాత్ముని అభిప్రాయము

కాంగ్రెసు అధ్యక్షునితోకలిసి రెండుదినములని జైలులోనిఖైదీలు అంతర్జాతీయపరిస్థితిమారినదికావున కాంగ్రెసువిధానములో మార్పుచేయవలసినదని గాంధిమహాత్మునికోరినట్లు వచ్చినవార్తవిషయమై మహాత్మునివద్దకు 'హిందు' పత్రికవిలేఖరిపోయియడుగగా, వారిట్లు చెప్పిరి "ఎటువంటిఆధారముగాని లేకపోయినను, ఇటువంటివిషయములు పత్రికలో వచ్చుచుండుట ఆశ్చర్యముగానున్నది. మౌలానాసాహెబ్‌గారివద్ద నుండిగాని, మరియే ఖైదీనుండిగాని నాకెట్టిలేఖగాని ఇటీవలవచ్చియుండలేదు. అవిధముగాకోరినటువంటి పత్రము నా సందేశహరుడు గాని తెచ్చియివ్వలేదు.

దేశములోను, విదేశములలోను పరిస్థితిమారినందువల్ల కాంగ్రెసువిధానమును సవరించవలసియున్నదని తలచుకాంగ్రెసు వారలక్షితియేమియని యడుగగా, గాంధిమహాత్ముడు ఇట్లుచెప్పెను. "వారలఅభిప్రాయములు మారియుండి, రంగు మార్చవలెనని వారియిష్టమయినచో, వారెప్పుడైనను అటులచేయవచ్చును, నా రామాట చెప్పినచాలును. ప్రభుత్వమువారి కోరకోర్కెగలదు" ఇటీవలదేశములోగాని, తెలుపలగాని జరిగినసంఘటనలేవిగానిసత్యాగ్రహమునుచాలించుటఅవసరమనిసూచించుటలేదాయని 'హిందు' పత్రికవిలేఖరి అడుగగా, గాంధిమహాత్ముడు ఇట్లుచెప్పెను, నాకుసంబంధించినంతవరకు ఏమియుజరుగలేదు-

### అమెరికాకు బ్రిటిషురాణి సందేశము

అగష్టు౧౦వతేది రాత్రిబ్రిటిషురాణి అమెరికాప్రజలకు బ్రాడుకాస్టు సందేశములోనంగురు ఇట్లు చెప్పెను.

"ఇన్ని నెలలుగా మేము తెలియుచున్నాము; ఈ నెలలలోమా జనులు పెద్ద భారమును మోయుచుండిరి. సేనవారలలోకిపోయినపుడు ఏమాత్రముతొణకనివారి స్థైర్యమునుచూచి ఆశ్చర్యముగొలిపినది. ఆ మానగరములలో వారలయిండ్లు కూలిపోయినవి. మాతో సమానముగా మీరుమలభిమానించు ఆలయములు చారిత్రక భవనములనుకూడ అద్భుతమైనవి. స్త్రీలునుశిశువులును చంపబడినారు, ఆస్పత్రిలో బాధపడేవారలనుకూడ వదలిపెట్టలేదు. అయిన నూ కష్టములు మాకుగుండెనిబ్బరమునిచ్చి సంకల్పమునొసగించునవి. సేనక్కడికిపోయినను నా కుప్రకాశవంతమైన కండ్లును, చిరునవ్వుతో కూడినముఖములును కనబడుచున్నవి, మనపాటలసాక్షితోనిండినను, కఠినమైనను అదిచక్కగానున్నది. మేముగొప్పఅశయముతో పోరాడుచున్నామని ఎరుగుదుము, కష్టపురోజులలో ఇతరులసహాయముకోరుట మాస్వభావముకాదు, అట్లుకోరవలసినమాకు కోరికయున్నను, మీరు మేముల మునుగకుండుటకుముందే వెంటనేసహాయముపంపియుండెడివారు. అమెరికనుల ఔదార్యముయొక్క ప్రత్యక్షఫలితములు ఈదీవులలోకివచ్చుచు, పోరాడుచున్నమా అందరి హృదయములకును ఎంతోహత్తుకొనదగినవైయున్నవి.

"శత్రువెంతఎక్కువదైనను, పోరాటమెంతదీర్ఘమైనను, న్యాయము, స్వాతంత్ర్యము, మానవసగౌరవము దయభూలోకమునుండి నశించజాలవు"

## లార్డు విలింగ్డనుగారి మరణము

ఇదివరలో లిన్లిత్గో గారికిపూర్వము భారతదేశానికి వైస్రాయిగ నుండినట్టి లార్డు విలింగ్డనుగారు ... లండనునగరంలో మరణించినారు- వారు ౧౮౬౬ సెప్టెంబరునెల ౧౨వతేదిన జన్మించియుండిరి- వారిఆస్తికి వారసుడు వైకౌంట్ రాట్లెడ్జోర్జ్ గారు-

## రవీంద్రనాథుని శ్రాద్ధదినము

గాంధిమహాత్ముని విజ్ఞప్తి

గాంధిమహాత్ముడు అగస్టు౧౪వతేదిన ఈక్రింది విజ్ఞప్తి గావించినాడు:-

అగస్టు౧౪వతేది గురుదేవునిశ్రాద్ధదినము-శ్రాద్ధదినమును మతదృష్టితో పవిత్రదినముగా భావించువారలు అరోజు పూర్తిగా ఆహారముమానియైనను, లేక అపక్వాహారముతో నుండియైనను ఉపవాసముచేసి, ప్రార్థనతో కాలక్షేపముచేయుగలరు- ప్రార్థనను ఎవరికివారేచేసికొనవచ్చును లేదా అందరును కలిసికూడను చేయవచ్చును.

గురుదేవుడు తనరచనలద్వారా ఒసగిన దీర్ఘరాగసందేశమును గ్రహించిన ప్రతినగరవాసులును, ప్రతిగ్రామవాసులును తమకు మిక్కిలి అనుకూలమైనవేళ ఒకచోటసమావేశమై, గురుదేవుని ఉదారజీవితమును ధ్యానించి దేశసేవకై బద్ధకంకణులుకాగలరు. గురుదేవుడు శాంతిసామరస్యములకొఱకై కృషిచేసినట్టివాడు- వారికి మతభేదపక్షపాతములుండెడివికావు-కాబట్టి ఈ శ్రాద్ధదినమును ఆచరించి మతసామరస్యమును పోషించుటకు అన్నితెగలవారలును కలిసి పనిచేసెదరని నేను ఆశించుచున్నాను.

మరియు అందరును దీనబంధు స్మారకనిధిలో అధికభాగము యింకను వసూలుకావలసియున్నదని జ్ఞాపకముంచుకొనదగును. అదిగురుదేవుని స్మారకనిధికూడఅయినదని దుఃఖముగానున్నది- ఎట్లనగా అదీనబంధు స్మారకనిధికివచ్చెడి డబ్బు విశ్వభారతి, శ్రీనికేతనముల రక్షణ, పోషణలకే వినియోగపడును.

అనగా గురుదేవునికి వేరేప్రత్యేకమైన స్మారచిహ్నము అవసరములేదనికాదు-కాని గురుదేవుడే స్వయముగాతలపెట్టిన స్మారకనిధి పూర్తిగాకముందే మరొకక్రొత్తనిధిని తలపెట్టుట అపహాస్యముగును-కావున వ్యవస్థాపకులును, పనిచేయువారలును అనిధికై ధనమువసూలుచేసి బొంబాయిలో, మహాత్మగాంధిరోడ్డు వీధిలో, ౫౧వనెంబరుచోట బక్షిరాజాఅండ్‌కో వారిపేర పంపించుటతో ఆశ్రాద్ధదినమును ముగించుట చాల యుక్తముగును.

### ఈరానుకు జర్మనీబెదరింపు

బ్రిటిషు, రష్యనుప్రభుత్వములకోరికపై ఈరానుప్రభుత్వమువారు ఈరానుదేశంలోని ౨౫౦౦ మంది జర్మనుప్రజలను తరిమివేయుచో, జర్మనీ ప్రభుత్వమువారు ఈరానుప్రభుత్వమువారు మైత్రినితెగదెంపులు చేసికొనవలసివచ్చునని జర్మనీ ప్రభుత్వమునుండి ఒకబెదరింపుసందేశము ఈరానుప్రభుత్వమునకు పంపబడినట్లు అంకారారేడియోలో అగస్టు ౧౫వతేదిన ప్రకటించబడినది- జర్మనీ బెదరించుచున్నను ఈరానులోని జర్మనుప్రజలను తరిమివేయకతప్పదని బ్రిటిషు ప్రభుత్వమువారు చెప్పుచున్నారు-




Printed and Published by, G. Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad Dn, Editor S. Prathapa Reddy B.A.,B.L.,